దిరములతో నిండియున్నది. ఇంద్రప్రస్థము, పృథ్వీరాయమందిరము, తుగ్లకాబాదు, షహాజనాబాదు గతవైభవములను దెలుపుచున్న మహామందిరములు. మందిరములు స్తంభితమైన హృదయమును తెలుపుచున్నవి, గాని చైతన్యపూరితమైన హృదయమును దెలుపుట లేదు. రైజినాయందలి సభామందిరమును జడహృదయమును దెలుపుచున్నది. ఇర్విన్ప్రభువు బ్రిటిషుప్రభుత్వహస్తములందు కీలుబొమ్మ. వారి మామూలుపాటలనె వీరును పాడుచుందురు. బర్కెను హెడ్డుప్రభువు కొన్నిమాసములక్రిందను ప్రకటించిన భావములనె ఇర్విన్ప్రభువుమృదుమధురముగ వ్యక్తముచేసెను. ఇర్విన్ప్రభువుచేసిన ప్రసంగము పిల్లలకు పాఠమువలెనున్నది. భారతప్రభుత్వముపట్లను బ్రిటిషు పార్లమెంటునకు సంపూర్ణాధికారము గలదని పిల్లలకును దెలిసియున్నది. భారతీయుల సొమ్మును తినుచున్న రాజప్రతినిధులు పార్లమెంటు ప్రయోజనములను గమనింపవలయునో భారతీయుల ప్రయోజనములను గమనింపవలయునో ధర్మపరాయణుడగు ఇర్విన్ప్రభువునకు తెలియని విషయముగాదు. పార్లమెంటును, బ్రిటిషుసామ్రాజ్యమును సంచలనముచేయుటకు భారతీయులకు శక్తియున్నపుడు రాజప్రతినిధులుపిల్లలకువలె పాఠములను జెప్పుటకు సాహసింపరు. వంగదేశ నిర్బంధితులు కుళ్ళుచున్నను రాజప్రతినిధికి దయగలుగలేదు. రాజ్యాంగ సంస్కరణములవిషయమై చిత్తవృత్తి మారలేదు. జాతీయ సంవిధానముపట్లను సనుగ్రహము రాలేదు. ప్రజలును, నాయకులును, సభామందిరప్రవేశోత్సవసమయమునను ఇర్విను ప్రభువు ప్రభుత్వహృదయమునందు గలిగిన పరివర్తనమును కార్యరూపమున వ్యక్తముచేయునని ఆశపడియుండిరి. ఆ యాశ నిరాశమైనది. ఇర్విన్ప్రభువు తెలిపిన భావముల కనురూపముగను సభావ్యవహారములును నడుచుచున్నవి.

చీనాయుద్ధప్రయత్నములు భారతీయుల నిస్సహాయస్థితిని విశదముచేయుచున్నవి. ఇర్విను ప్రభువు భారతీయుల ప్రమేయము లేకనే చీనాకు సైన్యములను బంపి భారతీయుల కవమానమును గలుగజేసెను. స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న సోదరఖండవాసులమీదను స్వాతంత్ర్యనిర్మూలమునకై భారతీయులను ప్రయోగించుట యధర్మము. ఇర్విను ప్రభువు తానుచేసినయకార్యమునువిమర్శించుటకైనను నవకాశమునొసంగక సామ్రాజ్యసభాప్రయోజనమునునిరర్థకముచేసెను. దేశమునందంతటను చీనాకు సైన్యములను బంపుట గర్హ్యమని ప్రజలు సభలనుజేసి ప్రతిపాదించుచున్నారు. నిస్సహాయస్థితియందున్న ప్రజలు మాటలతో సంతృప్తిని జెందవలయును గాని ప్రతిక్రియలను జేయజాలరు. తీర్మానములు ప్రజలకు స్వాతంత్ర్యమును సంపాదింపజాలవు. ప్రజలు కార్యపరతంత్రులు గానంతవరకును స్వరాజ్యముగాని, జన్మహక్కులుగాని లభింపజాలవు.

నిర్బంధితులవిమోచనమునుగాని, విచారణనుగాని కోరుచు పండిత మోతీలాలు నెహ్రూగారు ప్రతిపాదించిన తీర్మానమును ప్రభుత్వము ప్రతిఘటించుట నిరంకుశస్వభావమున కను



# విషయానుక్రమణిక

# చిత్రములు



